# హరిదాసి

[పావై పాటల స్వేచ్ఛానువాదము]



## సమర్పణము

చిన్నతనమునందే మాతృవిహీనుడనైన నన్ను లాలించి పాలించి

ముద్దుజేసిన ఒక

**వైష్ణవ భక్తురాలికి పుష్పాంజలులతో**





కూర్పు

**పి. దుర్గారావు,** యం ఓ యల్

ప్రథమ ముద్రణము వేయి ప్రతులు

సర్వ స్వామ్యములు గ్రంథకర్తవి

రుధిరోద్గారి నామ సంవత్సరము - హేమంతము మార్గళి
జనవరి - 1984

మూల్యము రెండు రూపాయలు

ముద్రణము
"వేంకట రత్నా" విజయవాడ-2

---

ప్రతులకు
**పి. దుర్గారావు**, యం. ఓ. యల్
చెరుకుపల్లి పోస్టు, (వయా) నక్రేకల్,
నక్రేకల్ తాలూకా, నల్లగొండ జిల్లా

3

# వినయ వాక్యము

శ్రీ లక్ష్మీదేవి యవతారమైన శ్రీ గోదాదేవి పాడిన మంగళ మహోజ్జ్వలములు మధురభక్తి ప్రవాహములైన తిరుప్పావై గీతములు వైష్ణవ భక్తి సాంప్రదాయానుయాయులకే గాక సర్వులకు పవిత్రము లైనవి ఈ గీతములు తమిళభాషలో గలవు

విష్ణ్వాలయములలో నిత్యానుసంధానము చేయు నీ గీతములు పెక్కుభాషలలో ననువదింపబడినవి తెలుగ భాషలో గూడ యెందరో మహానుభావులు తిరుప్పావై గీతములను గద్యపద్య గీతికా రూపములనే గాక విపుల వ్యాఖ్యలతో ప్రచురించిరి

కొంతకాలము క్రిందట యీ తిరుప్పావై గీతములను మహాకవి శ్రీ శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రిగారు తెలుగు భాషలో గీతికా రూపమున ననువదించిరి ఈ మధ్యనే రసజ్ఞులు శ్రీ ముద్రాల జూనియర్ గారు వారి షష్టిపూర్తి సందర్భమున తిరుప్పావై గీతములను గీతికా రూపమున ప్రకటించిరి

ఆ రెండు పుస్తకములను ఈమధ్యనే పరికించుట జరిగినది ఆ గీతములయెడ నాకు గలిగిన యాసక్తివలన తిరుప్పావైకి సంబంధించిన ఒకటి రెండు వ్యాఖ్యలను గూడ పరికించితిని నేనదివరకే కృష్ణభక్తితో గూడిన గీతములు ఒకటి రెండు పుస్తకములు రచించి ప్రచురించుటచేతను కృష్ణభక్తితో గూడిన యీ మధురగీతములు నన్నాకర్షించినవి

నాకు గొప్ప కవితాశక్తిలేక పోయినప్పటికి తమిళము రాకపోయి నప్పటికి ఈ తిరుప్పావై గీతములను రచించుటకు బూనుకుంటిని అనగా నాంధ్రీకరింపబడిన తిరుప్పావై గీతములను వ్యాఖ్యలను జూచి అనుకరించితి నన్నమాట

అయినను తిరుప్పావై గీతముల యెడ నాకు గల అనురక్తిచేత నాకు తోచిన రీతిలో స్వేచ్ఛానువాదమును గావించితిని పాడుకొనుటకు వీలుగా గీతములన్నియు ఒకేఒక ఛందస్సులో గూర్చవలెనని ప్రతి గీతమును నిరువది పంక్తులలో గూర్చితిని

# శ్రీ గోదాదేవి చరిత్ర

విల్లిపుత్తూరునందు విష్ణుచిత్తుడు (పెరియాళ్వారు) అను హరిభక్తుడు గలడు అతడు పరమ విష్ణుభక్తుడు అతడు తన పెరటిలో తులసీవనము పెంచుచుండెను అతడు ప్రతిదినము తన పెరటిలోని తులసీదళములతోను పూవులతోను దండలు గ్రుచ్చి ఆలయమూర్తియగు మన్నారుదేవునికి (శ్రీకృష్ణస్వామికి) సమర్పించుచుండెడివాడు స్వామికోవెలనుండి తీర్థప్రసాదములు గ్రహించి తిరిగి వచ్చుచుండెడివాడు

ఒకనాడు విష్ణుచిత్తుడు యథాప్రకారముగా స్వామికి మాల్యము లర్పించి తిరిగివచ్చునప్పటికి తులసీ వనముకో ఒక బాలిక కనిపించెను అతడా బాలికను గోదా యని పేరు పెట్టుకొని పెంచుచుండెను గోదా యనగా భూదేవి యనియు పూలమాల యనియు అర్థము

శ్రీ గోదాదేవి క్రమముగా పెరిగి పెద్దదగుచుండెను ఆమె వయసుతోపాటు విష్ణుభక్తికూడ వృద్ధియగుచుండెను ఆమె విష్ణుదేవుని వరించి మనసున ప్రేమించుచుండెను ఈమెకు ఆండాళు అనికూడ పేరు గలదు ఆండాళు అనగా లక్ష్మీదేవియని తమిళమున యర్థము।

శ్రీ గోదాదేవి ప్రతిరోజు విష్ణుచిత్తుడు శ్రీ స్వామికి తీసుకొనిపోవు మాల్యములను ధరించి తాను స్వామికి తగుదునా యని నిర్మలమగు బావియందును అద్దమునందును తన ప్రతిబింబముచూచుకొని యా మాల్యములను యథాప్రకారముగ బుట్టలో నుంచుచుండెను ఆ ఆముక్త మాల్యములనే విష్ణుచిత్తుడు స్వామికి సమర్పించుట జరుగుచుండెడిది।

ఒక దినమున విష్ణుచిత్తుడు స్వామి కర్పించు పూమాలల యందు ఒక దీర్ఘకేశమును జూచి శ్రీ గోదాదేవిని ప్రశ్నించును ఆమె మాల్యములను ప్రతిదినము నలంకరించుకొని బుట్టలో బెట్టుచుండునని విషయమును దెలుపును అతడు శ్రీ గోదాదేవిని మందలించి నూతన మాల్యములను స్వామికి దీసుకొని పోవను

విష్ణుచిత్తుడు తెచ్చిన నూతన మాల్యములు స్వామి మూర్తిపై నిలువలేదు విష్ణుచిత్తుడు కలతజెందెను। స్వామి స్వప్నమందు సాక్షాత్-

రించి నీ కొమరిత ధరించిన మాల్యములే నాకు మక్కువ" అని వ్రాకుచ్చును

శ్రీ గోదాదేవిని తమిళములో చూడి కుడుత్త నాంచారు" అని అందురు అనగా ధరించిన పూలదండ నిచ్చునది అని యర్థము ఈ "చూడికొడుత్త పదమునే సంస్కృతీకరించి ఆముక్త మాల్యద అని పేరుపెట్టి సాహితీ సమరాంగణ చక్రవర్తి శ్రీకృష్ణ దేవరాయల వారు గొప్ప ప్రబంధమును రచించిరి

విష్ణుచిత్తుడు తనకుమార్తె శ్రీ గోదాదేవి విరహవేదనను మన్నారు స్వామికి విన్నవించుకొనును। స్వామి ప్రత్యక్షమై ఆమెను శ్రీరంగనాధుని ఎద్దకు తీసుకొని పొమ్మనెను విష్ణుచిత్తుడట్లే తనకుమార్తెను శ్రీరంగము నకు తీసుకొని పోవును।

శ్రీరంగమునందు విష్ణుచిత్తుడు శ్రీరంగనాధుని సేవించి స్తుతించెను శ్రీరంగనాధుడు అతని మనస్సునందుగల కోరికను తెలిసికొని గోదా దేవిని తన శుద్ధాంతమునకు చేర్చుకొనెను। ఒక మాయారూపిణిని ఆస్థానమం దుంచెను।

తీర్థ ప్రసాదములు స్వీకరించిన తరువాత అందరు విడిదికి వచ్చిరి కాని పల్లకిలో శ్రీ గోదాదేవి కనిపించలేదు విష్ణుచిత్తుడు దుఃఖించుచుపోయి శ్రీరంగనాధస్వామికి విన్నవించుకొనును। స్వామి కూతునింటివద్దనుంచు కుని యిచ్చట మొఱపెట్టుట న్యాయముకాదని శ్రీరంగనాధుడు పలికెను। విష్ణు చిత్తుడు తన విడిదికి పోయిచూడగా శ్రీ గోదాదేవి యచ్చటనే యుండెను

తరువాత విష్ణుచిత్తునకు శ్రీరంగనాథస్వామి శ్రీ గోదాదేవి యందు తనకు గల ప్రేమను వ్యక్తము చేయును బ్రహ్మాది దేవతలను రాయబార మంపును విష్ణుచిత్తుడంగీకరించు స్వామి తన గ్రామమైన విల్లిపుత్తూరునకు పరివారముతో వచ్చినచో పాణిగ్రహణముసేతునని పలుకును

అట్లే స్వామి తన పరివారముతో విల్లిపుత్తూరునకు వచ్చి శ్రీగోదా దేవిని వివాహమాడుట జరుగును ఈ కథా వృత్తాంతమునే గైకొని శ్రీకృష్ణ దేవరాయల వారు ఆముక్త మాల్యద ను రచించిరి

తన చెలులతో బాల ముకుంద స్వామి మందిరమున కేతెంచి ద్వార రక్షకు లకు వందనము చేయుచుండుట పదునేడవ గీతమునుండి యిరువది మూడవ గీతము వరకు స్వామిని మరియుతర దేవతలను మేలు కొలుపుట ఇరువది నాల్గవ గీతము స్వామిని దర్శించి మంగళనీరాజన మిచ్చుట గలదు

ఇరువదియైదు ఇరువది యారవ గీతములు పరవాద్యము లొసగుమని స్వామిని వేడుకొనుట (పరవాద్యములనగా శంఖములు వాద్యములు వైతాళికులు దీపమాలా స్తంభములు ధ్వజములు వితానములు తులసీదళ మాలికలు మున్నగునవి) ఇరువదియేడవ గీతమున వ్రతసమాప్తదిన మున తన్ని కోరికలను యాచించుట ఇరువది యెనిమిది ఇరువది తొమ్మిది గీతముల జన్మ జన్మలకు ఆత్మయున్నంత వరకు భక్తిని బాంధవ్యమును కోరుకొనుట ముప్పదవ గీతము మంగళాశాసనముతో సమాప్తమగును

మార్గశిర వ్రత మనగా ధనుర్మాస వ్రతమని యర్థము సూర్యుడు ధనుస్సునందు ప్రవేశించినది మొదలు మకరరాశిలో ప్రవేశించునంత వరకు (ముప్పది దినములు) కన్యలు యీ వ్రతమాచరింతురు ఈ వ్రతమాచ రించినందున కన్యలు కోరిన వరుని పొందుదురనియు చక్కని వర్షములతో దేశము సుభిక్షముగా నుండుననియు పురాణములలో చెప్పబడినది గోప కాంతలు ఈ ధనుర్మాసమున కాత్యాయనీదేవి వ్రతమాచరించినట్లుగను శ్రీహరిని పొందినట్లుగను శ్రీమద్భాగవతమునందు గలదు

శ్రీగోదాదేవి కలియుగమున అందునను దక్షిణభారతమున జన్మించినది. తాను పొందదలచిన వర్తి సర్వవ్యాపకుడైన శ్రీకృష్ణుడు భగవంతుని యవ తారములలోగూడ శ్రీకృష్ణుని యవతారమువలె లీలలతో సన్నిహితత్వము మరి యే అవతారమునను గనుపడదు అందువలననే ఆమె శ్రీనందగోప కుమారుని ప్రేమించినది

తాను ప్రేమించిన నందగోపకుమారుడు గోపికలు వ్రేపల్లె యమునానది మున్నగునవి లేవు తానున్నది కలియుగము తానేమో నందగోపకుమారుని ప్రేమించినది అదెట్లు సాధ్యపడును?

అందువలన శ్రీ గోదాదేవి తననొక గోపికనుగా తన చెలులను గోపికలుగా విల్లిపుత్తూరునే వ్రేపల్లెగా సమీపముననున్న నదినే యమున-

తన గ్రామమునగల మన్నారు కృష్ణస్వామి మందిరమునే నందగోపకుమారుని మందిరముగా భావించి ఆనాడు గోపకన్యలు వ్రతమాచరించినట్లు తాను వ్రతమాచరించినది గోపకాంతలు శ్రీకృష్ణుని పొందినట్లు శ్రీ గోదాదేవియు హరిని పొందినది పొందుటయనగా పరిణయమైనది

శ్రీమద్భాగవతమునందు గోపకాంతలు హరిని పొందుటకై యమునలో జలకమాడి శ్రీ కాత్యాయనీదేవిని పూజించినట్లు గలదు శ్రీగోదాదేవి అట్లుగాక జలకమాడి నేరుగా హరినే పూజించుట తిరుప్పావై గీతములందు గలదు

తిరుప్పావై గీతములందు స్వామిగా వ్రత నిర్వహణమునకు పరవాద్యములనిమ్మని వేడుకగలదు ఇట్టి వ్రతపుకరణములనుగాక నిశ్చలమైన భక్తియని గూడనర్థము చెప్పవలెనను పరమార్థమును బొందుటకు భక్తి యవసరమనియు భక్తిగూడ పరమేశ్వరానుగ్రహమువలన సిద్ధించుననియు అందువలన భక్తిని ముందుగా సాధించి భక్తిద్వార పరమార్థమును సాధింపవలయునని గూడ స్పష్టము చేసినట్లు చెప్పవచ్చును

ఇందలి ప్రతిపాశురము స్వామియందు ప్రణయము బాంధవ్యము భక్తియనుభవింపవలెననెడి భావము వ్యక్తమగుచున్నది శ్రీ వైష్ణవదీక్షయందలి చరమ శ్లోకమువలె తిరుప్పావై నందలి 28 29 పాశురములు ప్రధానమైనవి ఈ గీతములు భగవంతునికి ఆత్మసమర్పణముగావించి ఆత్మయున్నంతవరకు భక్తిని బాంధవ్యమును గోరుచున్నవి

శ్రీయుత డా॥ ఆరిపిరాల విశ్వంగారు శ్రీ సముద్రాల వారి "కృష్ణభాష పీఠికలో తెలిపిన— గోదాదేవి పరవశ భక్తిగానం దిగంతాల వేనవేల — యుగాంతాల దనుక పరిస్పందించే ప్రణవ పరంపర

అట్టి మహనీయ గీతములకు—అనుకరణములుగా ననుకరణమైన నా యీగీతములు సహృదయుల నేమాత్రము పరిస్పందింపజేసినను ధన్యునిగా భావించుకొందును పరమ పవిత్రమైన యీ మార్గశియందే యీ గీతములను రచించి ప్రచురించుట నా భాగ్యముగా భావించుచున్నాను

—రచయిత

# 6

చెలియా! తెల్లవారె చిన్నారి! పొన్నారి
నిదర లేవే చెలియా! నిదుర లేవేమే!

సిందూరం రాలిచె చిత్రముగ తూర్పుదెస
కనవె వెలుగు ఛాయ బంగారు కాంతులుగా!

చిలుక గోరింకలవె చెట్టు కొమ్మ పైని
కిలకిలా రావముల క్రీగంటి! వినవమ్మ
గుడిగంటలవి మ్రోగె! మడిబడిన భక్తులు
స్నానమాచరిమ్మ సఖియా! నిద్దుర లేచి!

అఖిలేశ్వరుండు శ్రీ అచ్యుతాలయము సు
శంఖనాదము లవిగో! వాన! వినలేవమ్మ?
వేదపఠనము లవిగో వినిపించరావటే?
హరి మాధవా! యనెడి యర్చించు కీర్తనలు!

విషపు చను పాల్ద్రావి విదిలించి రక్కసిని!
మధుర మూర్తిని జేసి మన్నించు శ్రీవిభుని!
మా యశోదాయని పిన్న మర్దించువాని! 'హే!
పతితపావన! యనెడి ప్రార్థనలు వినరావ?

పాలకడలిని పాము పాన్పుపై నిదురించు
పరమేశ్వరుని మనసు భక్తితో భావించి!
ఋషులు, యోగులు మునులు కృష్ణ! కృష్ణా! యనెడి
ధ్యానించు, భజియించు ధ్వనులు వినరావటే?

# 7

ఓసి! లేజవరాల! ఓసి వ్రజ వగలాడి!
వినలేవటే చెవులా? కనలేవటే కనులా?

మాధవాలయమందు మధుర గీత ధ్వనులు
శుభనాదములు సుంత సుదతి! వినరావటే?

వానకోయిల పలుకు వార్త వినరాదటే?
పంజరములో చిలుక పలుకు వినరాదటే?
తెలవారి వచ్చెనే! చెలియ నిద్దుర లెమ్మ!
జలజాక్షు పూజింప జనక బులాడదము!

కంఠహారములు ఘలుఘల్లు మనుచును నుండ
కటిసూత్రములు వింత కాంతు లీనుచు నుండ!
కురుల పూవాసనల గోపకాంతలు లేచి
కవ్వములు కొలచేటి నవ్వడులు వినరావ?

కేశి రక్కసు ద్రుంచి వాసికెక్కినవాని
హరి! కృష్ణ! మాధవా! యచ్యుతా! యని మేము
నిఖిలేశు గుణములను నీ వాకిటను నిలిచి
సంకీర్తనలు పాడ సఖియ! వినరావటే?

ఇంత నిద్దుర తగునె? ఇంతి! ఓ చేమంతి!
ఓ చిన్ని దొరసాని! ఓ యిందు వదనా!
తలవాకిలిది తెఱచి తరలిరావే వేగ!
తాన మాడగ చెలులు తరలిపోసాగిరే!

# 8

ఇకనా యీ నిదుర? ఇంకనా పవళింపు?
చాలు చాలే నిదుర! సఖియ వే లేవే!

మార్గళీ మాసమున మాధవుని పూజింప
మనసు బూనితివి గదె! చెలువరో! లేలెమ్మ!

తొలికోడి కూసెనే! తెలవారుచున్నదే!
మంచు ముత్యాలతో పుడమి తెల్లనాయెనే!
మంచు పచ్చిక మేయ మందగా ధేనువులు!
తరలుచున్నవి చూడు తరుణి! వే లేవమ్మ!

చప్పట్ల తాళముల సరసగీతములతో
స్నానమాడగ బోవు జలజాక్షులను నిలిపి!
నిను లేపవచ్చితిమి నీరజాక్షిరో! లెమ్మ!
కలువకన్నుల తెరచి కాంత! వేరాగదవె!

తొలి సంజ లవె చూడు! తోరణము కట్టెనే!
కమలములు వికసించె! కలువలవె ముకుళించె!
పూర్ణపురుషుని గొలువ పూన్కి పట్టితిమిగదె!
జాలంబు సేయగా జలజాక్షి తగునటే?

అశ్వముఖ రక్కసుని యణచివేసినవాని
చాణూర ముష్టికుల స్వర్గ మంపినవాని!
వీణాది వాద్యముల వేడుకను భజియింప
మన కోరికల దీర్చి మన్నించునే చెలియా!

# 9

మామయ్య కూతురా! సుగుణ! శీ! తెలవారె!
లువన్నెలు తెఱవి కాంతి! నా మాట విను!
మణికవాటము తెఱచి నను గూడ రాగదే
జలకమాడగ బోవు జలజాక్షులము చెలియ!

పరిమళపు దీపముల పసిడికాంతులు వెలయు
మణిఖచిత సౌధమున నుండు బగు శయ్య!
నియమమును విడనాడి నిదురించుచుంటివా?
తామరలు వికసించె తరుణి! యిక లేవమ్మ!

మార్గళీ మాస మను మాట మఱచితివేమొ?
మాధవుని పూజింప మర్యాద దాటితివా?
స్నానంబు లాడుటకు సఖియ! భయపడితివో?
కలువలవె ముకుళించె! కాంత! యిక లేవమ్మ!

అత్త! నీ సుకుమారి అవిటిదా? చెవిటిదా?
మూగదా? మురిపాల ముద్దు నీ చిన్నారి!
ఎట్లు కదలకుండగను పటుమంత్ర మేసితివ?
గాఢ నిద్రాం మునుగ కట్టు కట్టితివేమొ?

జలకంబులాడుటకు సమయమాయె నటంచు
నీ ముద్దులాడి నిక నిదుర లేపవె అత్త!
శ్రీకరా! పరమాత్మ! శ్రీరామ! కృష్ణ! యని
వేయి హరినామములు వేడ్క బాడితిమిగద!

# 10

ఓ సఖి! ఓ చెలీ! ఒకమాట పలుకవే!
మనసు కవాటము తెఱచి మాతోడ పాడవే!

హరినామ కీర్తనలు హరియించు పాపములు!
గొంతుకలుపవె చెలియ! గోవింద స్తుతులతో!

తలుపు తీయక నీవు తగ లోపలన యుండి
మగనితో! మా మాట మన్నించకున్నావు!
అటులైన సరి సరియె! అటులె లోపలయుండీ
కలుపవే నీ గొంతు కమలాక్షు కీర్తనల

పసితి హరివ్రతముచే పరమ సుఖముల నంది
అనుభవింపగ గోరు అతివ! మా తల్లిగదు!
నిదుర వేలొల్లనవమ్మ! నీలవర్ణుని దలచి
గొంతు కలుపవె చెలియ! గోవింద కీర్తనల

వైజయంతీమాల వక్షమున ధరియించి
పంచాయుధములతో పాలించు లోకములు!
ఆదిమధ్యాంతముల నడరెడి పర జ్యోతి!
వరభాగ్యముల నిచ్చి పాలించునే చెలియ!

అల కుంభకర్ణుడు అలరి యోటమి నొంది
తన నిద్దురను నీకు తగనిచ్చి పోయెనా?
పరమాప్తము బొంది పతితపావను కృపను
పరమార్థమును బొంది పరమసుఖ మొందవే!

# 11

లేవె శాంతమూర్తి! యిటు రావె! శోభనమూర్తి!
ప్రఖ్యాతమున బుట్టి వర్ధిల్లు లతకూన
చంద్రబింబము బోలు అందా మోముతో
కలువపూవు సొగసు కనులొప్పు సుకుమారి!

కుండ పొదుగుల ధేను కోటి గలవారింట
సిరిసంపదల తోడ చెన్నారు గృహమందు!
గోపకుల కులములో పరగ బుట్టినదాన
ఓసి నెమలి రాణి! ఓసి ఒయ్యారీ!

ఈ మార్గళీ మాస మింపొదగా రోజు
తెలిరేక కుముంగ 'తిరుమలేశా!' యనుచు
జనకంబులాడి హరి జలజాక్షు పూజింప
ప్రతిన బూనితిమి గదె! యతివ! మఱచితివేమొ!

ఇందీవర శ్యాము సుందరుని మోహనుని
సర్వేశు భజియించు సఖియలందఱ మమ్మ!
నీ తలపు వాకిటను నిలిచి పాడే మేము
నీవారమె సఖి! నిదుర లేవే చెలియ!

పంకజాక్షుని పాదపద్మములు వర్ణించి
కమ్మని నిదురపు కొమ్మ తగునా నీకు?
జనకంబులాడుదము! జలజాక్షు పూజింప
ఇహ సుఖముల బొందగ ఇంతి మేల్కొనవమ్మ!

# 12

ఏమి నిదురో గాని యోగమే చెలియా!
ఏ మాయ క్రమ్మెనో యోగమే తాయా!

నీ చిన్ని మనసులో నీరజాక్షుని ఉంచి
మాయనిదురను మునుగ మతులకే తెనుబొందె!

నీదు వాకిలిముందు నిలిచి జామైనదే!
మంచు ముత్యాలతో మా తలలు తడిసెనే!
ఏ మాయ నిదురయో యేపుగా నిను జుట్టె
కమలాననా! లెమ్మ! కాంతా! తేజోవతీ!

తన లేగలకు తమకోని చేపుగొనుచున్న
ఆల చను మొనలు క్షీరములు కురియుచుండె!
ఉదయ సంధ్యా కాంతు లోలాడె తూర్పు దెస
కమలములు కొలనిలో కాంతి వికసించెనే!

ఇలలేని సంపదలు గని వాని చెల్లెలా!
మా యమ్మ! మా తల్లి! మా ముద్దుగుమ్మరో!
మాయ నిదురను విడిచి మది నిల్పి హరిపైని
జలకంబులాడి శ్రీ జలజాక్షు పూజింపు!

రావణుని మనుమాడు రామకథ నంతటిని
పాటపాడగ ప్రజలు పారవశ్యము గొనిరి!
వీధి వారలు అది విని మెచ్చుకొనిరి ఖీ!
ఔరౌర! యికనైన యరి లేవవు నిదుర!

## 13

తెలవారుచున్నదమ్మా! మాయమ్మా!
తొలికోడి కూత వినవమ్మా!
లేడి కన్నులదాన! లేవె బంగరు బొమ్మా!
భగవంతుని పూజింప భక్తితో మేలుకొను!

ఉపనిషత్ సిద్ధమగు పరమ పురుషుని హరిని
హరి చరితమును నాలపించుట వినవె?
భామలందఱు గూడి భక్తి స్నానము జేయ
వైష్ణవాగ్రు పూజింప వరవర్ణిని! జనిరెప్పుడో!

పక్షులు నె మేతకై పయనమగుచున్నవే!
గురుడస్తమించెనే గుడి తలుపు తెఱచిరే!
వేగుచుక్కయు పొడిచె! వేడుకను బాలకులు
పాఠములు పద్యాలు పఠియించుచుండిరే!

ఈ పుణ్య హేమంత మీ మార్గశీర్షమున
సఖియలందఱి గూడి స్నానమాడక యిటుల!
ఈ నిదుర యేమనే? యీ రీతి తగునటే?
సఖియ! మన చెలులంత స్నానమాడగ జనిరి!

మల్లె మాలతి, పొగడ, మాలతీ పుష్పముల
హరిని పూజించి నీ వందుకొను సంపదలు!
చెలులతో గూడికొని శ్రీ హరిని పూజింపు!
సకల సౌఖ్యముల బొంది పరమార్థమందవే!

# 14

నిదర లేవే చెలియ! నీటు బంగరు బొమ్మ
అందరి నా పిలుపు ని నాలింపు దొరసాని

తొలిసంధ్య రేఖలవె! తూర్పు దెస వికసించె!
జలకమాడగ రావె! జలజాక్షి! సుకుమారి!

కమలములు వికసించె! కలువలవె! ముకుళించె!
తిరునామములతోడ తరుణి! జియ్యరు లదిగో!
కుంచె కోలల తోడ గుడి తలుపులను తీయు
నరుగు చున్నారదిగో! అలరు గీత ధ్వనులే!

మునులు, యోగులు ముక్తి మూలపురుషుని హరిని
ధ్యానించు చుండిరదె! జ్ఞాన వైరాగ్యములు!
శ్రీవిష్ణు భక్తులదె! చిద్విలాసుని గొలువ!
హరి కీర్తనలతోడ నరుగు చున్నారదిగో

నేన మీ దరి జేరి నిదుర లేపుదు ననుచు
నెఱవాది మాటలను నీటు గులికితివి నాడి
సిగ్గుపడవేమిటే! చేటి! నీ మాటలకు
ఆడి తప్పిన దానవైతివే! చెలియరో

అమ్మ దొంగా! ఎంత అల్లారు ముద్దువే!
ఇంత నిద్దుర తగునె? యింతి నీకే తగును!
మధుర వచనములచే సుముఖివై వే రాక
పతిత పావనుని శ్రీ పరమాత్ము ప్రార్థింప!

# 15

## శ్రీ గోదా దేవి

"ఓ చిఱుత రాచిలుకా! ఓ మధుర శుభవాణీ!
వారిపూజ మఱచి యిటు అలస నిద్దుర తగునె?
నీ కొఱకు వేచి ఇటు నిలిచి యున్నారమె
ఇకనైన లే లెమ్ము! ఇంతి! జలకములాడ!

నోము మానను మఱచి నేమమును విడనాడి
హాగీరనను మాను యతివ! యిది తగునటే?
ఎవరి నెఱిగిన ఇటుల యెటుల దోచితివి చెలీ?
వేచియుంటిమి! పిలుపు విని వేగ రాగదే!"

## చెలియ

'నడికారి తనముతో నొవ్వజేయకుడమ్మ!
తొలికోడి కూయగా తొయ్యలీ! లేచితిని!
మాయ నిద్దుర నమ్మి మఱల నిదురను బోతి!
క్షణ మాగరమ్మ! యిదె! చనుదెంచు చుంటి నే!"

## శ్రీ గోదా దేవి

"క్షణమైనగ దినమౌ లే! గడియ యన వత్సరము
గడప పాటుట యన్న కావలయు యుగము లే!
సఖియా! నీ చతురత్వ చాతుర్యములు తెలియు
గడుసు దానా! వేగ కదులు! జలకములాడ!"

## చెలియ

"గడుసుదాన నటంచు గణుకొనకుడమ్మ!
మాట నేర్తి యందు మఱి మీరె చతురులూ!
కోపగించకు తెంపు! కొసరు మీ మాటలకు
జలకంబులాడ మన చెలులంత వచ్చిరా?"

## శ్రీ గోదా దేవి

"వచ్చినారమ్మ! యిక విచ్చేయవే కొమ్మ!
ఒక్క రొక్కరినిగా లెక్కించుకోవమ్మ!
హరినామముల తోడ యఱచి నిను పిలుచుచు
ఇచటనే తెలవారె! యింతి! నీ వాకిటను!

కరిని గాచినవాని కల్యాణ ధాముని!
విశ్వరూపుని వేద విమల స్వరూపుని!
పూజింపగా మేము పోతి! పోనాయెనే!
చరచరా రావమ్మ! చాన! చిలకమొలాడ!"

# 16

[గోపికలు యమునానదిలో స్నానము చేసి స్వామిని దర్శించుటకై హరిమందిరమున కేతెంచి హరిద్వార రక్షకులను ప్రార్థించుట]

హరి ద్వారమున నిలుచు అన్నలారా వినుడు!
హరిమందిర గమన ద్వారపాలకులారా
సుందర ధ్వజములను అందాల తోరణాల
రాజిల్లు హరిద్వార రక్షకులు వందనము!

వందనంబులు మా విన్నపము దయగా గొనుడయ్యా!
వద్దు కాదని పలికి మళ్ళీ రమ్మనకండీ!
మణి కవాటము తెఱచి మన్నించవె మా మనవి
అట్టి స్వామిని జూచి యిట్టె పోవుదుమయ్యా!

వ్రత మాచరించుటకు వరతార వాద్యములు
ఇత్తునని పలికె హరి యింపుగా మాతోడ!
జలకంబులాడి శ్రీ జలజాక్షు దర్శింప
పూజింప వచ్చితిమి! పుణ్యపురుషులు వినుడు!

కల్ల కపటము లేని గొల్ల కన్నెలమన్న!
సుందరుని గోవిందు జూడ వచ్చితిమన్న!
నల్లనగు స్వామిపై నాట్యము తో పాడి
పూవు లర్పించి మా పురమునకు బోయెదము!

గోపాల దేవునకు కూర్మి దాసులమయ్యా!
తలుపు వేగ తెఱచి మము దర్శింపనిండయ్యా!
కైశికీ రాగమున కల్యాణ ధామునికి
మేలుకొలుపులు పాడి మేమిదే పోయెదము!

# 17

[స్వామికి మేలుకొలుపు పాట]

మేలుకొను! గోవింద! మేలుకొను గోపా!
ఆపదల రాకుండ ఆదుకొను పరమాత్మ!
అన్న వస్త్రము లిచ్చి ఆలించు పాలించు
పరమపురుషా! నీకు ప్రణతు లివె! గైకొనుము!

తొలిసంధ్య ఉదయాద్రి తేలియాడ మునుపు
యమునా తరంగిణిని యమున జలకము లాడి
నీ దర్శనము గోరి నీ ధ్యానమున నిలిచి
వేచి యున్నామయ్యా! వే నిదుర లేవయ్యా!

తన్వీ! వ్రజభామినీ! తల్లీ! యశోదమ్మ!
వందనములు గొనుము! సంరక్షణా దీక్షమా!
అల్లనల్లన లేచి మెల్లగా శ్రీహరిని
మేలుకొలుపుము తల్లి! మేలు జగతికి కలుగు!

మూడు లోకంబులను మూడడుగుల గొలిచి
ఆక్రమించితివయ్యా! ఖిలేక వటుడవై!
చాలించు నీ నిదుర సర్వలోకేశ్వరా
పాలించు మమ్ము దయ భద్ర! జీవేశ్వరా!

మేలుకొను బలదేవ! మేలుకొను బలవీర!
కనక మంజీరంబు కదరాక పాదమున!
తమ్ముడగు వారితోడ తెగ నిదుర లేవయ్యా!
మేలుకొని మా మనవి విని మేలుకో! దయ చుమ్ము!

# 18

- యశోదకు ముద్దు అందాల గోపాలా!
అఖిల లోకేశ్వరుని యర్ధాంగి! శ్రీదేవి!
ఓ నీలసుందరి! ఓయమ్మా! మేలుకొను!
తలుపుతీయుము తల్లి దయగనుము మాపైన!

తొలికోడి కూసినది! తొలిసంధ్య వెలుగొణకె
గురివింద పొదలలో గోరింక పలికినది!
పంజరములో చిలుక పలుకు వినవేమమ్మా!
తలుపు తీయవదేమి? తప్పేమి మాపైన?

కందుకము, కమలమును కరమూని ధరియించి
శ్రీహరికి సన్నిధిని చేరి నిలిచే దేవి!
చంద్రబింబము మించు అందాల మోముతో
అలరి భక్తుల కోర్కె లందించు మహాలక్ష్మి!

హరి సేవకై మేలుకొని అలరి వర్తిల్లుమమ్మా!
కరుణింపుమమ్మా! శ్రీ కల్యాణి! వరలక్ష్మి!
అందరము గూడి శ్రీ హరినామముల భక్తి
పాడుచుందము తల్లి! పాలించు మా మనవి!

నిదుర మేల్కొనుమమ్మా! నీరజాక్షి! సరోజ!
పరమ సిరులకు కల్పవల్లి! జగదీశ్వరి!
శ్రీహరిని దర్శింప జేరవచ్చితి మమ్మా!
కల్యాణి! హరిజేరు కాంక్ష నిడేర్పుమా!

# 19

గజరాజ వరద! శ్రీ కమలాక్ష! మాధవా
పలుకవా ఒకమాటు? పలుకు! బంగారమా?

నోరార పలుకగా నోటి ముత్తెములన్ని
రాలునా? జారునా? మేలుకొను జగదీశ

కప్పురపు దీపాల గదియందు సుకుమార
అగరు ధూపములతో ఆనందమును గొలుపు
పరిమళము వెదజల్లు పాన్పుపై శయనించు
పరమపురుషా! లేచి పలుకవా? ఒకసారి!

వికసించు విరులు కడు వేడ్క కొప్పున దాల్చి
పరమ సిరులకు కల్పవల్లి! జగదీశ్వరి!
పదములొత్తుచున్నాడ పాన్పుపై శయనించు
మాధవా! ఒకమాటు మన్నింపు మా వినతి

నిదుర లే! గోపాల నిదుర లే! గోవిందా!
వ్రత నియమ పాలనకై వచ్చిన కన్నెలము!
స్నానంబులాడి యిక జలజాక్ష! వచ్చితిమి!
నీ దర్శనము గోరి నిదుర మేల్కొనుమయ్య!

కలువ కన్నుల తల్లి! లక్ష్మీ శ్రీనీళ!
నీవైన తెలుపుమా! నిఖిలేశ్వరుని తోడ
మణి కవాటము తెఱచి మాధవుని మేల్కొలిపి!
హరితోడ మా మొఱను హరిణాక్షి! తెలుపవే

# 20

మేలుకో! వనమాలి మేలుకో! శ్రీకృష్ణ!
మేలుకో శ్రీనిధి! మేలుకో తల్లీ!

అఖిల లోకంబులను ఆలించి లాలించి
పాలించు సంపదలు ప్రణతు లివె గొనరా!

ఇంద్రాది దేవతల నింపుగా కాపాడి
మునుల యోగుల ప్రోచి మోక్షమిచ్చెడి స్వామి!
వెన్నంటి రాక్షసుల వెతలు కూర్చేవాడ
ఆపన్నులను గాచు అఖిల లోకేశ్వరా!

గోపకాంతలమయ్య గోవింద! గోపాల!
నీ సేవకై వచ్చి నిలిచితిమి ద్వారమున!
యమునా తరంగిణిని యమలోదకమునందు
నీరాడి వచ్చితిమి! నీ పూజకై కృష్ణ!

ఓ నీళ! జగదాంబ ఓ లక్ష్మి! హరిదాసి!
మేలుకో! నిదుర ఇక మేలుకోవమ్మా!
నవ పుష్పధారిణి! నవమాల్య శోభినీ!
హరికి రత్నాలాప! ఆలింపు మా వినతి!

యమున యొడ్డున జేరి ఆటలను పాటలను
కృష్ణ పూజ సే[illegible] కీర్తించెదము!
ఆలవట్టము సురటియు నద్దమును వేవచ్చి
మము జేర పంపవే మాతల్లి! శ్రీహరిని!

# 22

స్వామి! నీ దయ యేది? సరస వీక్షణ మేది?
కరుణ మాపై చిలుక! కాంతలము ఎన్నింపు!

ఎట్టి తాపర వలె నింపారు కినుదోయి
మాపైని బలుపుమా! మాధవా! కరుణించి!

శత్రు రాజులు ఓడి శౌర్యమును గోల్పోయి
నీ గద్దె ఎదుటను నిలిచియుండెడి రీతి
మానాభిమానంబులు మమత ను విడనాడి
తరలి వచ్చితిమయ్యా తెగునయ్యా? యిది నీకు?

మార్గళీ స్నానమును మానినుల మిడె చేసి
ఆడుచును బాడుచును హరిభజన కీర్తనల!
నీ ద్వారమున నిలుచు నీరజాక్షులమయ్యా!
అరమోడ్పు కనులతో నల్లనల్లన జూడు!

సరసిలో పద్మములు ఝుంకారములతోడ
ముసురు తుమ్మెదలవలె ముక్తకంఠములతో
నీ మందిరంబు చుట్టు నిలిచినారము దేవ!
చల్లనీ చూపులను జల్లు మాపై కరుణ!

రవి చంద్ర కాంతులను రాజిల్లు వీక్షణము
హరియించు పాపములు ఆర్తి, తాపము మాపు,
నీ కృపా కిరణమే నిఖిల సంపదలకును
తావలము! మోక్షశ్రీ ద్వారమై విలసిల్లు!

## 23

తరలిరాగదనయ్యా! దయచేయవే స్వామి!
పాలింపగదనయ్యా! పరమ పురుషోత్తమా!

దర్శింపవచ్చినా తరుణులము పరమాత్మా!
పరవాడ్యముల గోరు వ్రజకాంతలము స్వామి!

పాలకడలిని శేషపాన్పుపై పవళించు
మధుసూదనా రమ్మా! మా మొఱల నాలింపు!
ఆ గజేంద్రుని బ్రోచి యాదరించిన రీతి!
మాపైని దయజూపు! మధుర పిలుపులను!

సురలు మునిబృందములు స్తుతియింప నీ కీర్తి!
చీల్చితివి రక్కసుని నరసింహ రూపమున!
ప్రహ్లాదు కరుణించి, యాహ్లాదమును గూర్చు
సరసవీక్షణములను స్వామి మాపై బఱపు!

వాన కాలమునందు వర్జించి గహనమును
గుహయందు నిదురించి, గ్రుమ్మగ మృగరాజు
జూలు, తనువు విదిల్చి కాలు రివి కదిల్చి
గర్జించి వెడలునటు కదలు స్వామీ! వేగ!

శిల్పసౌందర్యముల చెలువొందు బంగారు
రత్నాల గద్దెపై రమణితో గూర్చుండి!
మా మొఱల నాలించి మా పూజలను బొంది!
భాగ్యాలు కురిపింపు! భవజలధి దాటింపు!

# 24

(మేల్కొనిన స్వామికి మంగళ నీరాజనము)

మంగళము గోవిందా! మంగళము గోపాల!
మాధవా! వచ్చితిమి! మంగళము పాడగను!

విశ్వరూపుడ వనుచు విజ్ఞాన దీపమని
కల్యాణములు గూర్చు కారుణ్య మూర్తివని!

మున్ను రెండడుగులను భువి దివిని కొలిచితివి!
బలిని బంపితివిగా! పాతాళ భూములకు!
పల్లవారుణ దివ్య పాద పద్మంబులకు
మంగళం బిదే! నీకు! మాధవా! కరుణింపు!

ఘనమదాంధుల గూడి యల లంక దానవుల
భూభారమును దీర్చి పుడమి గాచిన దేవ!
సాధుజన హృదయ శ్రీ సకల జీవేశ్వరా!
మంగళము నీదు భుజ మహనీయ శక్తి కిదే!

శకటు రక్కసు బట్టి చిదిమితివి లీలగా!
వత్స రాక్షసు చుట్టి వంచితివి ఖేలగా!
వేణువున నాదముచు వ్రేతకాంతల నెల్ల
మఱపించు మాయ కిదే! మంగళము పరమాత్మ!

అల యమున నదియొడ్డు నాలమందల గాచి
అందాల కొలికించి యమరులను మురిపించి!
రాసక్రీడల గోపరమణులను దేలించు
ఆనందమూర్తి కిదే! యాత్మాభివందనము!

హరి దాసి

గొడుగువలె వ్రేలితో గోవర్ధనము నెత్తి
గోపకులమును గాచి గోరక్ష జేసితివి!
నీ రూపగుణములకు నీ నామ కోటులకు
మంగళం బిదె! నీకు మాధవా! గైకొనుము!

దుష్టుల నరిమార్చి శిష్టులను కాపాడు
అరిభయంకరములై యలరారు నీవైన!
శంఖు, చక్రము, గదా, శార్ఙ్గ ఖడ్గములకును
మంగళము! ఇదె నీక మంగళము! జయశ్రీ!

నిరతమును హరిచరణ నెడందున నిలుచు
అడుగు దామరలకును అంజలులు ఘటియించు
సిరులిచ్చు శ్రీదేవి! శ్రీనీళ సుందరి!
మంగళం బిదె నీకు మాతల్లి గైకొనుము!

ద్వారమందున నిలుచు తరుణులను బ్రోతువని
పరవాద్యముల నొసగి భరియింతువని దలచి
కనక పళ్ళెరమంద కర్పూర హారతుల
మంగళంబులు పాడ మాధవా! వచ్చితిమి!

# 25

(స్వామిని వరవాద్యము లిమ్మని వేడుట)

ఆర్థులము జగదీశ అబలలము పరమేశ!
ఆ జలులతో నిండు అనుగులము పరమాత్మ!

మా కోర్కెలను దీర్చి మన్నించు విభుడవని!
అనురాగ ఖని వగచు నరసి వచ్చితిమయ్యా!

ఒక అమ్మ దేవకీ యుదరమున జనియించి
ఒక అమ్మ వెడియందు నొదిగి పెరిగితివయ్యా!
కినవడి త్తుని కంసు కష్టాల నెదిరించి
గొల్లలను గొల్లవై గోలజేసితివయ్యా!

ఆగడాలు చేసి అసురులకు శిక్షివి గద!
ఆర్తులకు భక్తులకు నాప్తుండవు లోకేశ!
పరవాద్యము నిడ పాలిశ మా వ్రతము
జవరాలాడి యిటు జలజాక్ష! వచ్చితిమి!

మా కోర్కెలను దీర్చి మన్నించి బ్రోచుచో
మహనీయ సంపదల మహి నొప్పెదము స్వామి!
నీ నామ గుణములను నిరతమున స్మరియించి
ఆనంద వార్ధిలో నలరుదము జగదీశ

పతితపావన మాకు పరవాద్యము నొసగి
వ్రతము పాలింపగా పరమ భక్తియిమ్ము!
అఖిల లోకంబులకు నాత్మేశ్వరుండవని
అరసి వచ్చితిమయ్యా! యాత్మార్పణము సేయ!

# 26

ఈ మార్గళీ వ్రతము నీడేర్పగా వలయు
పరవాద్యముల నిచ్చి పాలింపవా స్వామి!

మా పూర్వ వంశజులు మాకు దెలిపినవన్ని
మామీద కృప జూపి మాకు దయసేయవా?

గోక్షీరము కన్న కూర్మి తెల తెల్లనగు
కుంద పర్వతము ఎదురు గురునాదము నొప్పు!
పాంచ జన్యముబోలు బహు శంఖముల నిమ్ము!
పెను నాదములు సేయు ఘన వాద్యముల నిమ్ము!

బంగారు పళ్లెముల మంగళంబగు దీప
శృంగారములు మిగుల చెన్నొందు గీతముల!
మంగళాశాసనము మదిపొంగ పఠియించు!
హరిదాసులను మాకు నర్పింపు పరమాత్మ!

దీపమాలిక లుంచు దివ్యమగు స్తంభములు
బహువన్నె ధ్వజములును బహు వితానములును!
తులసీదళములును విలసిల్లు మాలికలు
ఆలపట్టము, అద్దమును దయసేయుమా!

పరమ కారుణ్యా! శ్రీభక్తజనవత్సలా
వటపత్రశాయి! మా వరద! ప్రభు! లక్ష్మీశ!
మా నోము ఫలియింప మా కోర్కె లీడేర
అవధరింపుము స్వామి! ఆలించి కరుణింపు!

# 27

[వ్రత సమాప్తి దినమున కొన్ని కోరికలడుగుట]

దుష్ట సంఘము నణచి తూల జేసేవాడ!
ఆశ్రితుల కాపాడి యాదరించే స్వామి!
నీ దరిని జేరితిమి! నిన్నాశ్రయించితిమి!
జన్మములు సఫలమై ధన్యులము నైతిమిల!

స్మరించి, భజియించి, గీతముల స్తుతియించి
పరవాద్యముల బొంది వ్రత మాచరించితిమి!
వ్రతము ముగిసేవేళ వాసుదేవా కొన్ని
కోరికల మా కిమ్ము! గోవింద! కరుణింపు!

ఆడువారలమని యనాదరము సేయకుము!
తప్పులని దలపకుము! తరుణులము గద స్వామి!
వ్రజ కన్యలము సుమ్మి! వ్రతము ముగిసేవేళ
కోరుచుంటిమి కణ్ణ! కోర్కెలను కొన్నిటిని!

కంటె కాసులపేర్లు, కనకాంబరము లిమ్ము!
నడుమ కొడ్డాణమును నళినాక్ష! యనసేయి!
కాళ్ళకందియ లిమ్ము! కడియాలు మెట్టియలు
చెవుల కమ్మలు, చెంపసవరాలు గాజులును

ఆభరణములు దాల్చి యలరి వచ్చెదమయ్య!
ఇంత శుభసమయ మికనెపుడు వచ్చును స్వామి?
ఏ జీవులకునైన యీ భాగ్యమబ్బునా?
పాల్వెన్న మీగడలు పాయసము భక్ష్యములు
బంతులుగ గూర్చుండి భక్షింత మో స్వామి!

# 28

(జన్మ జన్మల భక్తిని సాధ్యమును గోరుట)

"చిన్నికృష్ణ" యనుచు నిన్ను చిన్ని పేర బిలిచిన నను
మన్నింపుము మాధవ! నీ గుణములను దయ నెంచి!
పేరు పెట్టి బిలిచితినని నేర మెంచ బోకుమయ్యా!
కోరిన మా కోర్కెలిచ్చి గోవిందా! దరిజేర్చుము!

కొండలలో కోనలలో గోవుల మేపుచు తిరుగుచు
వెఱ్ఱిగొల్ల కులమునందు ప్రవేశమైన జననమొ ది!
మాలో నీ వొకరివిగా మాట మంతి మెసలుచుంట
ఎన్ని వ్రతము లాచరింప! యీ భాగ్యము గలిగెనో!

మా నోముల పంటవనన మా పుణ్యము ఫలమనన
మాకోటకై జననమొంది మాలో నీవొకరివైతి!
గోపకులమునందు జేరి గోవిందుడవైతివయ్యా
విన్నపముల నాలకించి వినిపింపుము నీదు శుభము!

ఏ జన్మల బంధనమో ఏ జన్మల వాసనయో!
వీడని యీ విరహబాధము విడదీయుట వలను గాదు!
మా చేతను నీ చేతను మఱలింపగ వశము గాదు!
జన్మ జన్మలీ బంధము జత సేయుము శాశ్వతముగ!

పరమపురుష! పద్మనాభ! భక్తవత్సలా! శ్రీహరి
అజ్ఞానుల మనుగులము! ఆత్మార్పణమొయ్య నీకు!
నిన్ను శరణమని నమ్మిన నిరజాక్షులము కృష్ణా!
అన్య మెఱుగమోయి కన్నా! ఆది పురుష! విశ్వరూప!

# 29

మనసు తెలిసిన నీకు మనవి జేయగ వలెనా?
నీకు దెలియని దేమి? విశ్వమాభ్యధికుడవు!

ఆనంద! అచ్యుతా! అఖిలేశ్వరా! శౌరి!
మనకు సాధనము మర్యాద నిలుపుమా!

తొలి కోడి కూయక ముందు తెలవారు జామునను
జాగరంబులాడి యిటు 'జలజాక్ష!' 'శౌరి' యని
ఇష్ట సఖి కూడి గానా నిష్ట పూజించుటే
పరమాప్యమునకు నని భ్రమియించకుము స్వామి!

అడుగు దామరల కిదె ఆత్మార్పణం అనుచు
మధుర భక్తిని గొలిచి మంగళంబులు పాడ!
పుష్పాంజలులతోడ పూజలను సల్పుటను
పరమార్థములు పొంద పరమ లక్ష్యము గాదు!

గోకులమున జేరి గోరక్ష జేసితివి!
మమ్ము బాలింపగను మాయందు దిరిగితివి!
మా పూజలను గొనక మాధవా! మానేవు!
నీ సాధనము నిటుల నిలుపగ మా విన్నపము!

ఏ దేహ జన్మములు ఎన్ని యుగములకైన
విడివడని బంధమై ముడులువడి యుండవలె!
నీ పూజ! నీ భక్తి! నీ స్మరణ! నిలువవలె!
రేపటికి! మాపటికి! ఇప్పటికి! ఎప్పటికి!

# 30

## (మంగళాశాసనము)

ఈ మార్గళీ వ్రతము నెవ రాచరింతురో!
ఈ పుణ్య గీతముల నెవరాలపింతురో!
ఆనంద ధాముడౌ అఖిలేశు కృపచేత
అఖిలార్థములు బొంది యానందమగు గాత!

వ్రేపల్లెవాడలో గోప కన్నియలంత
పరవాద్యములబొంది భజయించి శ్రీ హరిని!
ఏ పూజలను జేసి యే ఫలములందిరో!
ఎఱుగువారికి శుభము లింపుగా సమకూరు!

విల్లిపుత్తూరు అను వెలయు గ్రామమునందు
విష్ణుచిత్తుని తనయ నెసగె తులసీవనము!
ముప్పదుల కృతుల నిడె ముద్దుగా బాడినది
పఠియించు వారలకు పరమ శుభములు గలుగు!

ఈ భక్తి గీతముల నింపుగా బఠియించి
ఆచరించెడివారి కఖిల శుభములు గలుగు!
పరమార్థమును గలుగు పావనంబగు భక్తి
ఆనందమంగళము లందరు శ్రీహరి కృపను!

హరి చతుర్భుజుడు శ్రీ అఖిలేశు డచ్యుతుడు
భక్తవత్సలుడు శుభ ముక్తిప్రదాయకుడు!
పరమ ప్రసన్నుడౌ పద్మాక్షు దయచేత
మహి ప్రజల కందఱికి మంగళంబగు గాత!

